శ్రీ

అన్నమాచార్య సంకీర్తన

# స్వరకుసుమాంజలి



సంగీత వ్యాఖ్యాతలు : స్వరప్రకల్పకులు

శ్రీమాన్

తిరుమల నల్లాన్ చక్రవర్తి వేంకట నారాయణాచార్యులు



గుంటూరు

1960

శ్రీ శ్రీనివాసాయ నమః

# విజ్ఞాపన

శ్రీ శ్రీనివాసుని నిర్హేతుక జాయమాన కటాక్ష ప్రసరణము వలన 1941వ సంవత్సరమున జాతిభేద సప్తతాళసహిత శతరాగ రత్న మాలికయు, 1951లో సరిగమాపాదసని పంచరత్నములును, 1953వ సంవత్సరములో పద్మావతీరాగ నక్షత్రమాలికయు, నా సంవత్సరము ననే బంధస్వరావళియు, 1957వ సంవత్సరములో గాంధర్వవేదామృత మును రచించి ముద్రింపించి సంగీతప్రపంచమున కందజేసియుంటిని. ఈ గ్రంథములన్నియు పండితుల యాదరణమునకు పాత్రములగుటయ గాక బంధస్వరావళితప్ప మిగిలినవన్నియు ఆంధ్ర యూనివర్సిటీవారు తమచే జరుపు సంగీత పరీక్షలకు పఠనీయగ్రంథములుగా నిర్ణయించి యున్నారు. వారి కెంతయు కృతజ్ఞుడను. ఈ గ్రంథ ప్రచురణము ముగిసినపిదప 1959 జనవరివఱకు గ్రంథరచనా ప్రయత్నమును విర మించియుంటిని. ఇట్లుండగా 59 జనవరి 24వ తేది వేకువజామున శ్రీనివాసుడు నిజరూపముతో ప్రత్యక్షమై "నీవు నాపై అనేక కీర్తన ములను రచించి ప్రఖ్యాతిగంటివి. నా భక్తాగ్రగణ్యుడగు అన్నమా చార్యుని సంకీర్తనములు ప్రచారములోనికి వచ్చునట్లు స్వరపఱచి నాకు ముదమును చేకూర్పుము" అని యాదేశించి యంతర్ధానమయ్యెను. వెంటనే నిద్రమేల్కాంచి ఆ భగవదాజ్ఞ కచ్చెరువొందుచు స్నాన సంధ్యాదులు నిర్వర్తించి తిరువారాధనము ముగించి ఆచార్యస్వామి పాయించిన సంకీర్తనగ్రంథమును జూచునప్పటికి "కొండలలో నెలకొన్న కోనేటిరాయడు వాడు" అను కీర్తనము కనుపించెను. వెంటనే యద్దానిని స్వరపఱచి తనివిదీర ననేక పర్యాయములు గానముచేసి మురిసిపోతిని. అంతట శ్రీనివాసునిపైననే సమస్తభారముంచి అన్నమాచార్యులవారి కీర్తన ములను స్వరపఱుప నారంభించి 108 కీర్తనలు స్వరలయబద్ధములుగా వ్రాసి భగవదాజ్ఞను నిర్వర్తించి ధన్యుడనైతిని. సరసులగు సంగీత విద్వాంసు లెల్లరును శ్రీవారికీర్తనలను సభలలో గానముచేసి అన్నమా చార్యులవారి కీర్తనలను వ్యాప్తికి దెచ్చుచు నా యీ ప్రయత్నము ఫలము గావింప వేడుచున్నాడ.

అన్నమాచార్యులగారి కీర్తనలు ఇప్పటి కాలమునుబట్టి నాద ప్రధానముగా స్వరపఱచినగాని గానమున కనువుగా నుండవు. వీరి కీర్తన లెక్కువభాగము సాహిత్యప్రధానములై యుండి తాళబద్ధములు చేయక విడువబడియున్నవి. అందువలననే శ్రీమాన్ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు సాహిత్యమునకే ప్రాధాన్యతయిచ్చి స్వరపఱచియుండిరి. పూర్వసాంప్రదాయమునకు భంగమువాటిల్లునని తలచి యిట్లు స్వర పరచియున్నానని వారు కంఠోక్తిగా చెప్పియున్నారు. అన్నమా చార్యులవారి కీర్తనలు ప్రచారములోనికి రావలెనన్న నాదసంచారము చేసి స్వరపఱచినగాని నాదోపాసనమే ముఖ్యమనితలంచు నీ దినము లలో శ్రోతల నానందింపజేయజాలవు. త్యాగరాజాదుల కీర్తనములు దేశకాల పరిస్థితులనుబట్టి నాదప్రధానముగా రచింపబడియున్నవి. త్యాగరాజను పూర్వపద్ధతితో దివ్యనామ సంకీర్తనలు భజనసాంప్ర దాయానుగుణ్యముగ రచించియు నాద ప్రధానముగ స్వరసంచారము చేసియుండిరి. ఏ కీర్తనముకాని నాదసంచారములేనిది వ్యాప్తిచెందుట కష్టము. త్యాగరాజాదుల కీర్తనలవలె అన్నమాచార్యుల కీర్తనలు శిష్యపరంపరా ప్రచారములోనికి వచ్చినవికాకుండుటచే నియ్యవి ప్రచా రములో లేకపోవుట తటస్థించినది.

(అన్నమాచార్యులవారి కీర్తనలలో మొదటి చరణమువలె నన్ని చరణములు నడువవు. ఏచరణమున కాచరణమే ప్రత్యేకముగు నడక గల్గియుండును. అందువలన ప్రతిచరణమునకు ప్రత్యేకముగ స్వర కల్పన యవసరమయ్యెను.) అయ్యది యధికశ్రమకు తావలమైనది. ఈకీర్తనల చరణములలో జూడ అన్నమాచార్యులవారి కాలమున నలవాటులోనున్నదో లేదోకాని మధ్యమకాల సాహిత్యముగా పాడి తాళబద్ధముచేయ వీలగుచున్నది. సాహిత్యప్రధానముగానున్న వారి కీర్తనలలోగల భావమాధుర్యము చెడకుండ నాదప్రధానముగ పెక్కు కీర్తనలు ప్రస్తరింప వీలుకలవియై యున్నవి. ఇట్లుండ తిరుమలలో జరిగిన అన్నమాచార్యులవారి యుత్సవసందర్భమున తిరుమల దేవ స్థానం ఎగ్జిక్యూటివు ఆఫీసరుగారగు శ్రీ చెలికాని అన్నారావుగారు శ్రీమాన్ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు శ్రమపడి అన్నమా చార్యులవారి కీర్తనలకు స్వరపఱచి సంగీతప్రపంచమున కందిచ్చినట్ల

ఇప్పటి సంగీత విద్వాంసులు నాదప్రధానముగా పాడుట కలవాటు పడిన యీకాలమున భజనసాంప్రదాయముగ సభలలోపాడి రక్తి కట్టించగలమాయని భయపడి యాకీర్తనలను పాడుట మానుచున్నారు అందువలన స్వర పరపించుట నింతటితోమాని, కేవలము కీర్తనలనే ముద్రింప తలపెట్టితి''మని తమ యుపన్యాసములలో చెప్పియుండిరి. ఈమాట విన్నప్పటినుండి శ్రీవారి కీర్తనములను నాదప్రధానముగా స్వరపఱచిన బాగుండునను ఊహ పొడమెను. కొంతకాలమునకు ఈ యూహకుతోడు స్వప్నమున భగవదాదేశముకూడ నగుటచే నాపనికి గడంగితిని.

నాదప్రధానముగా రచించిన త్యాగరాజాది వాగ్గేయకారుల కీర్తనలే శ్రోతల యానందమునకై ఆయారాగముల జనక రాగములను విడనాడి అన్యజనక రాగస్వరములను స్వీకరించి యిప్పటి విద్వాంసులు పాడుచుండ, ఆచార్యులవారు నిరూపించిన రాగములను మార్చిన దోషమేమియు నుండదని తలచి ఆవిధముగా స్వరప్రస్తారము చేసి యుంటిని. త్యాగరాజ కీర్తనలు మార్పుచేసి పాడు కీర్తనములను రెండు మూ డుదాహరింతును. "మోక్షము కలదా" అనునది సారమతి రాగము. "సామజవరగమన" అనునది హిందోళరాగము. జనకరాగమైన ఖరహరప్రియలో రచించిన "చేతులార శృంగారము" అను కీర్తనమును "నఠ భైరవి" రాగముగా పాడుచున్నారు. ఖర హరప్రియరాగమునందే పాడిన శ్రోతలు విన కుతూహలపడరు. ఈ హేతువులంబట్టి అన్నమాచార్యులగారు నిరూపించిన రాగములను మార్చి వేరురాగములలో స్వరపఱచుట దోషముకాదని తలచి అట్లు చేసియుంటిని. వీరి కీర్తనలన్నియు నెనుబది తొమ్మిది రాగములలోనే రచింపబడియున్నవి. ఇప్పుడు ప్రచారములోనున్న రాగములు వారి కాలమున ప్రచారములో లేక యుండవచ్చును. అయినను నిప్పుడు ప్రచారములోనున్న రాగములతోనే స్వరపఱచినచో కొంతకాలమున కవియే స్థిరపడిపోవును. ఒక రాగ విభాగమే అనేక కీర్తనలయందున్నచో గ్రహన్యాసములు మార్చినను రాగస్వరూప మొకటియే యగుటవలన పునరుక్తిశంక మానదు. కనుక రక్తికొఱకు రాగములను మార్చినను దోషముండదు. స్వర, రాగ, నాద విభాగములతో

మనోరంజకముగా నా కీర్తనలను స్వరపఱచినగాని యవి ప్రచారము లోనికి రాజాలవు. అట్టి యుద్దేశ్యముతోనే కీర్తనలలోని సాహిత్య భావము చెడకుండ రాగముల మార్పుతో కొన్ని కీర్తనలను స్వర పఱచియున్నాను. ఈ విధముగ స్వతంత్రించి యిట్టిమార్పు చేసినం దులకు రసికులును, విమర్శకులునగు సంగీత విద్వాంసులెల్లరు మన్నింతురు గాక.

నేనురచించిన సంగీత గ్రంథములన్నిటిలో నా నేక విధముల తోడ్పడినది శ్రీమాన్ వి. వి. నరసింహాచార్యులు గారని చెప్పుట కెంతయో ముదమందుచున్నాను. నేను గ్రంథరచన మారంభించి నప్పటి నుండియు నాకధికోత్సాహము కలిగించుచు, నాచే రచింపబడిన గ్రంథములన్నియు పరిశీలించి పరిష్కరించి నిర్దుష్టముగ నొనర్చి యొసంగియు, ఎట్టిసందేహములు వచ్చినను నాసందేహముల నప్పటి కప్పుడు తీర్చి రాజమార్గమును జూపుచుండియు, ముద్రణావిషయ ములో సర్వవిధముల తోడ్పడియు, గ్రంథములకు పరిచయములను వ్రాసియు నాగ్రంథము లన్నిటిని సర్వాంగ సంశోభితములుగ నుండు నట్లు తీర్చి దిద్ది యొసంగియున్నారు. ప్రస్తుతము వ్రాసిన "అన్నమా చార్య సంకీర్తన స్వరకుసుమాంజలి" యను సంగీతవ్యాఖ్యాన గ్రంథ మును ప్రారంభించినదాది స్వరపఱచిన కీర్తనల నెప్పటికప్పుడు పాడి వినిపింపగా నెంతయో కుతూహలముతో వినుచు రాగసాహిత్యభావ ముల కలయికచే నేర్పడిన సౌందర్యమును విశదీకరించుచు, స్వరమట్లు వేయుటలో సమకూడిన భావవిశేషములను వివరించుచు నేస్వరపఱ చిన నూటయెనిమిది కీర్తనలను సమగ్రముగవిని యీగ్రంథమునకు గూడ ఉపోద్ఘాతమును సర్వవిషయ పరామర్శముతో వ్రాసియొసంగి యుండిరి. వీరికి నాయందు గల సోదరభావము వాకొన నలవికానిది. ఇట్టి విమర్శకాగ్రేసరులును, మహాపండితులును, సంగీతసిరకులును నయిన ఉభయభాషా ప్రవీణ శ్రీమాన్ వేదాంతం వెంకటనరసింహా చార్యులవారికి సవినయముగ నతిశతంబు లర్పించుచున్నాడ.

నా యీ రచనము ముగిసిన పిదప ఆంధ్రప్రదేశ సంగీత నాటక అకాడమి గుంటూరులో నొక సంగీత గురుకుల మేర్పఱచి నన్ను కుల

పతిగా వరించియుండెను. 4-10-1959 తేదీన దాని ప్రారంభోత్సవమునకు ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక అకాడమి అధ్యక్షులును, కార్వేటి నగర సంస్థానాధీశులును, ఆంధ్రప్రదేశ్ శాసన సభాసభ్యులును, సంగీత రహస్యముల నెరిగిన పండితులునగు శ్రీ. ఆర్. బి. రామకృష్ణరాజుగా రధ్యక్షులుగా దయచేసి యుండిరి. ఆ సందర్భముననే అన్నమాచార్య సంకీర్తనస్వర కుసుమాంజలి యను నీ గ్రంథము శ్రీవారిచేతనే ఆవిష్కరింపబడెను. ఈ గ్రంథావిష్కరణము చేయుచు "ఇయ్యది అనతికాలమున ప్రకటింపబడి ప్రచారములోనికి వచ్చుగాక" యని యాశీర్వదించిన శ్రీ శ్రీ శ్రీ రాజాగారికి కృతజ్ఞతాపూర్వక వందనము లర్పించుచున్నాడ.

సంగీత రచనావిధానములో నా కృషికి మిక్కిలి సంతోషపడు నట్టియు, నా యీ స్వరపఱచిన కీర్తనములు వినిపింపగా సదయులై సావధానముగా విని యారచనావిషయమున తమ యమూల్యాభిప్రాయ మొసంగిన మదరాసు విశ్వవిద్యాలయ సంగీత ప్రధానాచార్యులును, సంగీతకళానిధి ఇత్యాది బిరుదాంకితులునగు శ్రీ. పి. సాంబమూర్తి B. A. B. L. గారికి శతాధిక ధన్యవాదము లర్పించుచున్నాడ.

మఱియు సంగీత సాహిత్య విశారదులును, విమర్శకాగ్రేసరులును, తాళ్ళపాకవారి కీర్తనలను స్వరబద్ధము చేసిన మహనీయులును నగు గాన కళాప్రపూర్ణ శ్రీమాన్ రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మగారికి నాయీ స్వరపఱచిన కీర్తనలను వినిపించి వారి యాశీస్సుల నందుకుంటిని. మఱియు నా రచనపై వారి సదభిప్రాయమునుగూడ వ్రాసియిచ్చియుండిరి. అట్టి శ్రీమాన్ అనంతకృష్ణశర్మ గారికిని అనేక దాసోహము లర్పించు చున్నాడ.

నాకు లభ్యమైన 'అన్నమాచార్యకీర్తనల గ్రంథమునుబట్టి నూటయెనిమిది కీర్తనలు స్వరపఱచిన పిమ్మట శ్రీమాన్ అనంత కృష్ణశర్మగారు స్వరపఱచిన సంపుటమునుజూడగా వారు స్వరపఱచినవే 10 కీర్తనలు నేనును స్వరపఱచుట తటస్థించినది. వానితో నా విషయమును తెల్పగా స్వరకల్పనలో భేదముండుటవలన బాధ యేమియు లేదు. వీనిని

తొలగింపక యుంచవలసినది. అని సదయులై సలహానొసంగియుండిరి. వారి సలహాప్రకార మా కీర్తనములను తొలగింపక యిందు పొందు పఱచియుంటిని. అట్టి యుదారమగు సలహానొసంగిన శ్రీ శర్మగా రెంతేయు సంస్తవనీయులు.

ఈ గ్రంథ ముద్రణసహాయార్థమై ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీవారు 750 రూప్యముల నొసంగి గౌరవించిరి. వారి కెంతేయు కృతజ్ఞుడను.

ఈ గ్రంథ ముద్రణమునకు ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీవా రొసంగిన విరాళరూపమగు సన్మానమేగాక యింకను కొంత మంది యుదారులగు దాతలు గ్రంథముద్రణము ముగియుటకు ధన సహాయ మొనర్చియుండిరి. వారి పవిత్ర నామములు వేరొకచోట ప్రకటించుచు నట్టి యుదారుల కెల్లరకు నా కృతజ్ఞతను దెల్పుకొను చున్నాడ.

నా యీ రచనమును నిరాటంకముగ ముగింప ననుగ్రహించిన నా యిష్టదైవమగు శ్రీ వేంకటేశ్వరస్వామి కంజలిఘటించుచు, అల్పుడ నగు నే నా భగవంతున కర్పింపదగిన దేదియు లేకుంటచే నీ స్వర కుసుమాంజలినే యీ పరాత్పరున కర్పించుచున్నాడ. ఈ కుసుమాం జలిని స్వీకరించి నన్ను ధన్యువిజేయ దేవదేవుని ధ్యానించుచున్నాడ.

ఇట్లు,

శ్రీనివాస కృపాపాత్రుడు

తి. న. చ. వేంకట నారాయణాచార్యులు.

# ఉపోద్ఘాతము

ఇదియొక మహత్తర స్వరకల్పనారూపమగు సంగీతవ్యాఖ్యాన గ్రంథము. ఈ గ్రంథ పరామర్శమున నాకు రెట్టింపు బాధ్యత యేర్పడినది. ఈ గ్రంథమునకు కృతికర్త యొకరు. వ్యాఖ్యాత వేఱొకరు. ఈ కృతికర్తయో, సుప్రసిద్ధపూర్వ వాగ్గేయకారులు. వ్యాఖ్యాతయో లోకప్రఖ్యాతి సముపార్జించిన మహాశక్తి సంపన్ను లగు అధునాతన వాగ్గేయకారులు. అట్టి మహనీయుల యిరువురి తెలుంగు లగు రచనలలోఁగల వైశిష్ట్యమును విశదీకరింపవలసి వచ్చెను. ఆపని చేయుట "తితీర్షుర్దుస్తరం మోహా దుడు పేనాస్మి సాగరం" అను చందమే యగును. అయినను ఆరంభించి వెనుదీయుట పురుష లక్షణముకాదను పెద్దల సూక్తి నన్ను ముందునకు నడుప ధైర్యముతో నీపనికి గడంగుచున్నాను. ముందు గేయప్రబంధమును గూర్చి యించుక విమర్శించి, పిదప సంగీతవ్యాఖ్యాన గ్రంథమును గూర్చి నా యోచినంతవఱకు పరిశీలింతును.

ఈ గేయప్రబంధకర్త తాళ్లపాక అన్నమాచార్యులుగారు. వీరి వంశము సంగీతవంశము. అన్నమాచార్యులగారి కొడుకు, మను మలు మున్నగువారెల్లరు సంగీత విద్వాంసులగుటయేగాక, గేయ రచయితలుగూడనై వాసిగాంచి యున్నారు. సుప్రసిద్ధులగు అన్నమా చార్యులుగారు సంగీతసాహిత్యములయం దసమానప్రజ్ఞ గడించిన వారగుటయకాక అనేకవేల గేయములను రచించి భక్తిపరవశులై పాడియుండిరి. వీరి గేయములే మన ఆంధ్రభాషలో రచింపబడిన గేయముల కాదిమములు. మొదటినుండియు కర్ణాటక సంగీతమున రసవత్తర గేయ రచనమంతయు తెలుగుభాషలోనే సాగుచువచ్చినట్లు కనబడుచున్నది. సుప్రసిద్ధ తమిళ వాగ్గేయకారులుగాని కన్నడ వాగ్గేయ కారులుగాని వారివారి భాషలలో గేయములు వ్రాసినను తెలుగులో వ్రాయుటమాత్రము మానినవారు గారు. నిన్న మొన్నటి వఱకు గానసభలలోగూడ తెలుగు కీర్తనములనే పాడుచుండెడి వారు. తెలుగు గేయములు గానసభలలో పాడి రక్తికట్టించుట కుపయోగించినవిగ నుండుటయే యిందుకు ముఖ్యకారణము. తెలుగు

నుడికారము రసవత్తరము. తెలుగు వాగ్గేయకారులవాక్కు రస పుష్టము. వారి హృదయము రసాలవాలము. ఇక వారి వాక్కుల నుండి వెడలిన గేయములు రసవత్తరములుగాక మరేమగును? ఇక నీ సంగతి యటుండనిండు.

చారిత్రకముగ పరిశీలించిన రసవత్తర కర్ణాటక సంగీతమున కున్నతస్థితిని తెచ్చినవా రాంధ్రులని సగర్వముగ చెప్పవచ్చును. తెలుఁగుభాషలో లిఖితరూపకముగ బయల్పడిన గేయములన్నిటిలో మొట్టమొదటి గేయములు తాళ్లపాక వారివే యని చెప్పుట కెవరును సందియ మొందరు. తెలుగు వాగ్గేయకారు లెల్లరును భక్తాగ్ర గణ్యులై భక్తి పారవశ్యముతో గేయములు రచించిన మహాపండి తులు. అందువలననే తెలుగువారి కీర్తనము లింపులు సొంపులుకలుగు చుండును.

మన తెలుగు గేయములు మూడు సాంప్రదాయములుగ రచింపబడియున్నట్లు కానవచ్చుచున్నవి. కొన్ని భజన సాంప్ర దాయములు. మఱికొన్ని నాదసంచార ప్రధానములగు మధుర సాంప్రదాయములు. వేరొక కొన్ని ఉభయాత్మక సాంప్ర దాయములు. రామదాసు మున్నగు భక్తాగ్రగణ్యులు రచించిన కీర్తనము లన్నియు భజన సాంప్రదాయమునకు జెందియున్నవి. ఇయ్యవి సభలలో గానముచేయుట కుపయోగింపవు. ఇక త్యాగ రాజాది భక్తాగ్రేసరులగు వాగ్గేయకారులు రచించిన కీర్తనలు నాద ప్రధానములై సభలలో గానముచేసి సామాజికులను రసముగ్ధుల జేయ వీలగుచున్నవి. ఇయ్యవి మధుర సాంప్రదాయమునకు చెందును. ఇక నుభయాత్మకము లన్నమాచార్య గేయములు. వీరు రచించిన గేయములలో కొన్ని సాహిత్యప్రధానములుగను, మఱికొన్ని నాద ప్రధానములుగను కన్పించుచున్నవి. కనుక కొన్ని గానమున కుప యుక్తమగునట్లు స్వరపఱుప వీలుకాకున్నను, కొన్నియైనను స్వర పఱుప వీలగుచున్నవి. మన తెలుగు వాగ్గేయకారులలో నాదిముడగు అన్నమాచార్యులు రచించిన గేయములు వందలసంఖ్యలో గాక వేల సంఖ్యలో నున్నవి. ఈ కీర్తనలన్నియు రాగిరేకులమీద చెక్కబడి

తిరుమల దేవస్థానమందలి "సంకీర్తన భాండార" మను కొట్టులో పెట్ట
బడి యజ్ఞాతవాసములో నుండియున్నవి. అట్టి కీర్తనములు శ్రీ వేటూరి
ప్రభాకరశాస్త్రిగారి పరిశోధనాఫలితముగ బహిర్గతములై లోకములో
సంచరింప నారంభించినవి. అట్టి మహోపకృతియొనర్చిన మాన్యులకు
మున్ముందు మన నమస్కృతులు తెలుపవలసియున్నది.

పిమ్మట దేవస్థానమువారును శ్రద్ధవహించి, దీక్షపూని మహా
పండితులచే అనేక కీర్తనలెత్తి వ్రాయించి ప్రకటించి మహోపయో
గము చేసియున్నారు. అంతియేకాక ప్రచారమున కుపయుక్తముగ
నుండునట్లు శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారిచే 108 కీర్తనలు
స్వరపఱపించి ప్రకటించియున్నారు. ఈ ప్రకటనములవలన అన్నమా
చార్యులవారి కీర్తనల కొకింత ప్రచార మేర్పడెను. కనుక తిరుపతి
దేవస్థానమువారును, శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారును ను.
ప్రశంసాపాత్రులగుచున్నారు. భర్తృహరి నీతి, శృంగార, న్న టంగు
శతకములను విభాగములతో నీతులను గఱపియున్నపగిది ీరసింహా
భక్తి, శృంగారములకు సంబంధించియుండునట్లు కీర్తనల్కు పిలిపించు
యున్నారు. ఈ కీర్తనము లన్నియు ప్రచారములోకి మానందమును
తెలుగు సంగీత వాఙ్మయము సర్వాంగ సంశోభితమై కు విజయనగర
గలదు. ఇక ఆదిమ వాగ్గేయకారులగు అన్నమాచా విద్యానగరము
మిటు సంగ్రహించుట అప్రస్తుతకార్యము కాజాలదనియెంచాచార్యులను
నా పనికి పూనుకొందును. డపవ్వాడు

(శ్రీ అన్నమాచార్యులుగారు పొత్తపినాటిలో చేరిన కడపమం
లములోని తాళ్ళపాక గ్రామమున నందవరీక బ్రాహ్మణకుటుంబమున
జన్మించెను. ఈయన తండ్రి కుమారనారాయణుఁడు. తల్లి లక్క
మాంబయను వాడుకపేరుకల లక్ష్మమ్మ. లక్కమాంబ పరమ భక్తు
రాలు. ఆ గ్రామములోని మాధవస్వామి యీమెతో సంభాషించెడి
వాడని ప్రతీతి గలదు. ఈ దంపతు లిరువురు లక్ష్మీనారాయణులవలె
సంతోషముగ కాలము గడుపుచుండిరి. వీరి కన్ని సంపద లున్నను
చాలకాలము పుత్రసంపద లేకయుండెను. దైవభక్తియే ప్రధానము
గాగల ఈ పుణ్యదంపతులు తిరుమలకు వెళ్ళి శ్రీ వేంకటేశ్వరస్వామి

నారాధించుచు నటనే కొంతకాలముండిరి. ఒకనాటిరాత్రి భగవం తుడు ప్రత్యక్షమై కుమారనారాయణున కొక కత్తినిచ్చి యంతర్ధాన మయ్యెను. అదియే వరముగాభావించి యీ వృత్తాంతము భార్యతో జెప్పి పరమానందమును బొందుచు తమ గ్రామమునకు తిరిగివచ్చెను. అంత కొంతకాలమునకు భగవంతుని యనుగ్రహముచే నందకాంశమున నొక కుమారుడు క్రీ॥ శ॥ 1424 సం॥ క్రోధననామ సంవత్సర వైశాఖ శు॥ ౧౫ నాడు జననమందెను. ఆ పిల్లవానికి అన్నమయ్య యని పేరుపెట్టిరి. వీరి వంశము పండితవంశ మగుటచేతను, నందకాంశ సంభూతు లగుటవలనను, పూర్వజన్మవాసనా విశేషమువలనను అన్న మయ్యకు సమస్త విద్యలు అనతికాలముననే వచ్చియుండెను. చిన్న

గణ్యు తులు. చుండును.

తనమునుండియే యీ మహనీయునకు కవిత్వముచెప్పు శక్తియేర్పడెను. అంతేకాక సంగీతమునం దసాధారణ ప్రజ్ఞయబ్బెను. ఆ కారణమున చిన్ననాటినుండియు శ్రీ వేంకటేశ్వరస్వామిమీాద గేయములు

మన రచింపబడియున దాయములు. సాంప్రదాయములు. దాయములు. కీర్తనము లన్నియు ఇయ్యావి సభలలో రాజాది భ

రచనముచేయ మొదలిడెను. పదునారవయేడు వచ్చువఱకును గ్రామములోనే యుండి గేయములను రచించుచుండెను. ఒకనాటిరాత్రి శ్రీనివాసమూర్తి సాక్షాత్కరించి ''నీవు నాపై గేయములు నా సన్నిధిలో గానముచేయుము'' అని చెప్పి యంతర్ధానమొందెనట. అట్టి భక్తాగ్రగణ్యుడగు అన్నమయ్య ఆనాడే బయలుదేరి కొన్నిదిన ప్రయాణములతో దిగువతిరుపతిచేరి గోవిందరాజ స్వామిని దర్శించి యీ స్వామిమీాద కొన్ని పాటలుపాడి పరమానంద భరితుడై యుండెను. అంతట మరునాడు కొండ యెక్క నారంభించి ప్రధానస్థలములో విశేషములన్నియు దెలిసికొనుచు శ్రీ స్వామివారి సన్నిధికి చేరి యీ దివ్యమంగళరూపమును కనులార తనివిదీర దర్శించి యచ టనే యుండి స్వామి కైంకర్యముచేయ నిర్ణయించుకొని స్వామివారి ఆలయముననే కాలము గడపుచు నిరంతరము శ్రీ స్వామివారిపై గేయములను వ్రాయుచు, వానిని గానముచేయుచు నుండెను.

ఇట్లు కొంతకాలము గడచినపిదప తల్లిదండ్రులు ఇంటికి రమ్మని కోరినను స్వామి సన్నిధిని విడువజాలక అక్కడనేయుండి స్వామికైంక ర్యము చేయుచుండెను. ఈ విధముగ కాలము గడుపుచుండ అచ టనేయున్న 'ఘనవిష్ణు'డను నొక విష్ణుభక్తుని యనుగ్రహమువలన

వైష్ణవసంస్కారములను బడసి, మంత్ర మంత్రార్థములను వారినుండియే గ్రహించి యటనుండి వైష్ణవుడై అన్నమయ్య అన్నమాచార్యులుగా మారిపోయెను. అటుపిమ్మట గురువుగారైన ఘనవిష్ణుడు గృహస్థాశ్రమము స్వీకరింప ననుజ్ఞ యీయగా అన్నమాచార్యులవారు స్వగ్రామమునకు వెళ్ళి గృహస్థాశ్రమమును స్వీకరించి, వేంకటేశ్వర స్వామిపై కీర్తనములను రచించుచునేయుండిరి. అన్నమాచార్యులు గారినుండియే వీరి కుటుంబము వైష్ణవముగా మార్పుచెందెను.

ఒకపరి అన్నమాచార్యులుగారు అహోబలక్షేత్రమునకు వెడలి యచటనున్న శఠకోపమునిని గురువుగా జేసికొని వారికడ వేదాంత శాస్త్రము నభ్యసించి అష్టాక్షరీ మంత్రోపదేశమును బొందెను. అంత కొంతకాల మచటనేయుండి స్వామివారిని దర్శించి తిరిగి యింటికివచ్చి శ్రీమద్రామాయణమును గేయరూపముగ రచింప నారంభించెను.

ఈ సమయమున విజయనగరరాజుల పరిపాలనలోనున్న టంగుటూరు మండలమునకు దండనాథుడుగానున్న సాళువ నరసింహరాయడు అన్నమాచార్యుల కీర్తిని విని తన యాస్థానమునకు పిలిపించుకొని వారు రచించిన గేయములను పాడించి విని పరమానందమును బొందెను. ఈ నరసింహరాయడు కొంతకాలమునకు విజయనగరమును బరిపాలించు రెండవ విరూపాక్షుని జంపి తాను విద్యానగరమునకు చక్రవర్తి యయ్యెను. అప్పుడు నురల అన్నమాచార్యులను హంపికి రావలసినదిగా వేడుకొన వాని కోరికప్రకార మప్పుడప్పుడు ఆచార్యులవారు విద్యానగరమునకు వెళ్ళివచ్చుచుండెడివారు. ఆ సందర్భమున హంపిలోని దేవుళ్ళపై ననేక కీర్తనములు వ్రాసెను. తాను చక్రవర్తియైన పిదప నరసింహరాయడు అన్నమాచార్యులవారికెన్నియో అగ్రహారాదులిచ్చి ఘనముగ సత్కరించెను.

ఆచార్యులవారొకపరి వేంకటేశ్వరస్వామిపై తాను రచించిన మధురభావోపేతమగు శృంగార కీర్తనమును నరసింహరాయనికి వినిపించెనట. ఆ కీర్తనలోని భావమును విని రాయడు ముగ్ధుడై యట్టి కీర్తనము తనమీద వ్రాసిన బాగుండునని తలచి ఆచార్యులవారిని కోరగా "మానవులపై వ్రాయుటకు నా వాక్కు ప్రసరింపదు. కనుక

నే నట్టి పనిని చేయజాల"నని ఖండితముగా చెప్పెను. రాయలు రాజ్యమదాంధతచేత కన్నుగానక గురుభావమునుగూడ మఱచి ఆచార్యులవారిని బంధింపజేసెను. అపు డాచార్యులవారు రాయలనేమియు దూషింపక ఆ వేంకటేశ్వరస్వామి నొక గేయముతో ప్రార్థింపగా వెంటనే యీ బంధము లూడిపోయెను. అపుడు రాయలు ఆచార్యులవారి భక్తి కచ్చెరువంది తానుజేసిన పనికి పశ్చాత్తప్తుడై క్షమాపణవేడుకొనెనట. ఈ వృత్తాంతమునుబట్టి చూడగా అన్నమాచార్యులవారి భక్తిపారతంత్ర్య మెట్టిదైనది విశదమగుచున్నది. ఈ మహనీయుఁడు ముప్పదిరెండువేల పదములను వ్రాయుటయేకాక కొన్ని శతకములను, ఇతర గ్రంథములనుగూడ వ్రాసినట్లు చెప్పుదురు.

వీరు తిరుమలలో నివసించి తాను రచించిన గేయములను స్వామివారి సన్నిధిలో గానముచేయు సందర్భమున నొకపర్యాయము కన్నడ గేయ ప్రబంధ రచయితయు, భక్తాగ్రగణ్యుడునగు పురందర విఠల్‌దాసు అను మహాపండితుడు శ్రీ వేంకటేశ్వరస్వామిని దర్శించుటకై తిరుమలకువచ్చి స్వామివారి సన్నిధిలో గానముచేయుచున్న శ్రీవారి గేయములను విని, యీ పదములలోని భావ మాధుర్యమును గ్రోలి పరమానందభరితుడై "అవతార పురుషుడవీవయ్యా! అన్నమయ్యా!"అని యెంతగనో కొనియాడి యుండెను.

అన్నమాచార్యులవారు గృహస్థాశ్రమము స్వీకరించినప్పటి నుండియు తాళ్లపాక గ్రామములోనే యుండి వేనకువేల గేయములు రచించి గానము చేయుచు నుండెను. తన కుమారులు పెద్దవారైన పిదప తాను తిరుమలలోనేయుండి శ్రీ స్వామివారి సేవచేయుచు తన కాలము గడపవలెనను కోర్కె ఖిక్కుటముకాగా సంసారభారమంతయు పుత్రుల కప్పగించి తాను తిరుమలచేరి స్వామివారి సన్నిధిలో గాన కైంకర్యము చేయసాగెను. వీరి పుత్రులలో పెద తిరుమలాచార్యులు పేరుపొందినవాడు. గొప్ప పండితుడు. శ్రీనివాస మూర్తి భక్తుడు. అన్ని విషయములలోను తండ్రిని మఱపించినదిట్టి. ఇట్టి భక్తాగ్రగణ్యుడగు పెద తిరుమలాచార్యులును తండ్రిగారితోనే తిరుమలకు వెళ్ళెనని యీకుటుంబములోని వారు చెప్పుదురు. తండ్రితో

వెళ్ళినను తర్వాత వెళ్ళినను వారు తిరుమలలోనేయుండి శ్రీ స్వామివారి సన్నిధిలో గానకైంకర్యము చేసినట్లు స్వామివారి ఆలయములోనున్న విగ్రహములవలన బోధపడగలదు. అన్నమాచార్యులు మాత్రము తిరుమలలోనేయుండి యింకను గేయరచనము సాగించుచు శ్రీ శ్రీనివాసుని సేవలో నిమగ్నుడై కాలము గడపుచు క్రీ. శ. 1503కు సరియగు దుందుభి సంవత్సర ఫాల్గుణ బ ౧౨నాడు ఇహలోకయాత్ర చాలించి పరమపదము నొందెను. వీ రంతటి భక్తవరేణ్యులగుట వలననే అన్నమాచార్యులవారి శిలాప్రతిమ వేంకటేశ్వర స్వామివారి ఆలయములో ప్రతిష్ఠించుట సంభవించినది. అన్నమాచార్యులు ఇతర గ్రంథములు వ్రాయ సమర్థులైనను పదకవిత్వము వ్రాయుటయందే పటిమను చూపియున్నారు. వీరి పద కవితాపటిమ యెట్టిదైనది చిన తిరుమలాచార్యులు వ్రాసిన యీ క్రింది పద్యములవలన విశదము కాగలదు.

పావనములు హరిభక్తివిభావనములు సర్వమంత్ర పరమరహస్యో
ద్భావనములు గాయకనికరావనములు తాళ్ళపాక అన్నయపదముల్
రంజనములు దుర్గుణగుణభంజనములు విమల కమలభవజనకగుణా
సంజనములు సుజ్ఞాన ధనాంజనములు తాళ్ళపాక అన్నయ పదముల్.
వేదంబులు పౌరాణికవాదంబులు వరకవిత్వవాణీ వీణా
నాదంబులు కృతసుజనాహ్లాదంబులు తాళ్ళపాక అన్నయపదముల్.
లక్షణములు పదకవితారక్షణములు వివిధకుకవిరాజీమదసం
మోక్షణములు వేంకటపతి వీక్షణములు తాళ్ళపాకవిభు సత్కవితల్.

మహాప్రతిభావంతుడును, పదకవితారక్షకుడు నగు అన్నమాచార్యులచే వ్రాయబడిన కీర్తనములు కొలదికాలము క్రిందటివఱకు నేనాలుగైదో తప్ప మిగిలిన కీర్తనలన్నియు ప్రచారములో లేకుండుట సంభవించినది. ఇప్పటికిని పదునాలుగువేలు మాత్రమే యుద్ధరింపబడి యున్నవి. ఆ కీర్తనలన్నియు కొలది రాగములలోమాత్రమే కూర్పబడెను. ఆ రాగములైనను నీ కాలమున వాడుకలోలేనివి పెక్కులు గలవు. ఇట్టి కీర్తనలు ప్రచారములోనికి రావలెనన్న కవి హృదయము

వ్యక్తపఱచుచు సుశ్రావ్యముగ పాడుటకు వీలైన వ్యాఖ్యానరూప మగు స్వరకల్పన మత్యవసరము. కావ్యములకు వ్యాఖ్యానములెట్లు సర్వవిషయ ప్రతిపాదకములగునో గేయప్రబంధములకు స్వరకల్పనమట్లు వ్యాఖ్యాన గ్రంథమగును. స్వరకల్పనములేని కేవల సాహిత్యమెంత మనోరంజకముగనున్నను ప్రాణములేని శరీరమువలె సముపాస్యము కాజాలదు. సాహిత్యమునకు స్వరకల్పనమే ప్రాణమని చెప్పదగును. కనుక ఈ గేయప్రచారమునకు స్వరకల్పన మెంతగనో తోడ్పడ గలదు.

పూర్వపు సుప్రసిద్ధ వాగ్గేయకారులగు త్యాగరాజాదులు తాము రచించిన కీర్తనములకు తామే స్వరకల్పనముచేసి తమ తమ విద్యార్థులకు బోధించి యుండిరి. అయ్యవి లిఖితరూపములో లేకున్నను శిష్య పరంపరాయాతముగ లోకమున ప్రచారములోనికి వచ్చి యున్నవి. అన్నమాచార్యుల కీర్తన లారీతి ప్రచారములోనికి రాలేదు. అన్నమాచార్యులకు శ్రీ స్వామివారి సన్నిధిలో గాన కైంకర్యము చేయుటకే వ్యవధి చాలకయుండెను. ఇట్టితరి శిష్యులకు బోధింప నవ కాశ మెట్లు కలుగును ? కనుక వారి కీర్తనము లారీతి ప్రచారము లోనికి వచ్చుటకు వీలుపడక యుండెను. అట్టి కీర్తన లిప్పుడు స్వర పఱచిననే కాని సత్వరవ్యాప్తి నొందజాలవు. ఆ భావముతోనే శ్రీ తిరుమల దేవస్థానంవారు శ్రీమాన్ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ గారిచే 108 కీర్తనలు స్వరపఱపించియుండిరి. అవి భజన సాంప్ర దాయాను గుణ్యముగ స్వరపఱుపబడియున్నవి. నాదప్రధానముగా స్వరపఱచినగాని సభలలో గానముచేయుటకు వీలుపడదు. సభలలో గానముచేసినగాని యయ్యవి సత్వరవ్యాప్తి నొందజాలవు. నాదప్రధా నములుగ స్వరపఱుప వీలైన కీర్తనములును వందలాదిగ గలవు. అట్టి పనికి సమర్థులగు సంగీతవిద్వాంసులు పూనుకొని నాద ప్రధానముగ స్వరపఱచుట అత్యావశ్యకమై యున్నది. ఇట్టి అవసర మును గమనించియే, పలువిధములగు సంగీత గ్రంథములను రచించిన మహాపండితులగు శ్రీమాన్. వేంకటనారాయణాచార్యులుగారు స్వర కల్పనారూపమగు వ్యాఖ్యానము వ్రాయసమకట్టి దీక్షతో నూట తొమ్మిది కీర్తనములను స్వరపఱచి గానార్హముగ జేసియున్నారు.

వీరు అనేక గేయప్రబంధములను, నూతన మార్గములలో అనేకరకము లగు సంగీత గ్రంథములను రచించియుండిరి. సంగీత సాహిత్యముల యందసమాన ప్రతిభావంతులు. కనుక ఇట్టి పండితులు చేపట్టినపని హృదయంగమముగా నుండుననుటలో సందియములేదు. ఇక వారి సంగీత వ్యాఖ్యానమును గూర్చి పరిశీలించి చూతము.

వ్యాఖ్యాత కవిహృదయ మావిష్కరింపఁదగిన సమర్థుడుగ నుతికెక్కవలెను. సర్వశాస్త్ర పండితుఁడై యుండవలెను. విశేష ప్రజ్ఞాశాలి కావలెను. బుద్ధిచాకచక్య మధికముగ నున్నవాడుగా నుండవలెను. ఇన్ని విశేషశక్తులు కలవాడుకాని వ్యాఖ్యాత కాజా లడు. అంతటి సమర్థుఁడైననేకాని కావ్యశోభను పెంపొందించుట కష్టము. మల్లినాథసూరివంటి రఘువంశాది కావ్య వ్యాఖ్యాతయు, శ్రీనివాసదీక్షితులవంటి శాకుంతలాది నాటకవ్యాఖ్యాతయు లభించుట వలననే మహాకవి కాళిదాసుని ప్రతిభ సలుమూలల వ్యాపింప నవకాశము కల్గెను. తెలుఁగుభాషలో మహాపండితుఁడును, విమర్శకాగ్రేస రుఁడు నగు వేదము వేంకటరాయశాస్త్రిగారు శృంగారనైషధమున కును, ఆముక్తమాల్యదకును సమగ్రమగు వ్యాఖ్యానములను రచించుట వలనగాదె శ్రీనాథ కృష్ణదేవరాయల అపూర్వ కవితాశక్తులు వెల్లడి యగుట కవకాశ మేర్పడెను? కనుక వ్యాఖ్యాతలు కవిహృదయ మెఱిఁగిన మహాపండితులై యుండవలెను. అన్నమాచార్య గేయ ప్రబంధ సంగీత వ్యాఖ్యాతలగు శ్రీమాన్ టి.ఎన్.సి. వేంకట నారాయ ణాచార్యులుగారును కవిహృదయము వెల్లడింపజాలిన మహాశక్తిసంప న్నులు. వీరి స్వరకల్పనరూపమగు సంగీతవ్యాఖ్యానమువలన అన్న మాచార్యుల కీర్తనలలోగల మాధుర్యము సంపూర్ణముగ వ్యక్తమై విరాజిల్లుచున్నది. అదియుగాక నాదప్రధానముగ స్వరపఱచియుం డుటచే నిటనుండి గాయకోత్తములును గానసభలలో వీనిని త్యాగరా జాదుల కీర్తనలతోబాటు గానముచేయుటకును నవకాశ మేర్పడినది.

శ్రీ నారాయణాచార్యులుగారు వ్యాఖ్యాతలేకాదు. వాగ్గేయ ప్రబంధ నిర్మాతలుకూడ. మఱియు సప్తస్వరములు సాహిత్యములో నిముడునట్లు అర్థవంతములగు కీర్తనములను వ్రాసిన మహాసమర్థులు,

స్వరకల్పన కుపయోగపడురీతి నూతనపక్కిలో బంధకవిత్వముల్రాసిన భవ్యగుణోద్భాసితులు. ఇట్టి మహనీయు లీపనికి పూనుకొనుటవలన అన్నమాచార్యులవారి కీర్తిలతలు సత్వరముగ దశదిశలలముకొన వీలుకలిగినదనుట నిక్కువము. ఇక నీ వ్యాఖ్యాతలు తమ సంగీత వ్యాఖ్యానమున జూపిన యద్భుతశక్తి యెట్టిదో యించుకంత పరిశీలించి చూతము.

అన్నమాచార్యులవా రెన్నియో కీర్తనలు వ్రాసియు కొన్ని రాగములలోనే పొదిపెట్టియుండుట యెల్ల రెరిగినదే. అవియు చాల వఱకు విన్నవి కన్నవి కావు. వానితోనే స్వరపఱచిపడవైచిన వాసిని గానముచేయువారే యుండరు. అపుడు వీని వ్యాప్తి కుంటుపడక తీరదు. అందులకై శ్రీ ఆచార్యులవారు అప్రసిద్ధ రాగములను సాహిత్య భావాదులనుబట్టి మార్పుచేసి స్వరపఱచియున్నారు. ఇట్లు చేయుటలో దోషమావంతేనియు గాన్పింపదు. వాడుకలోలేక లక్షణ మేమో తెలియక, పాడుటకు వీలుకాకయుండు రాగములలో స్వర పఱచుట యెట్లు? ఒకవేళ స్వరపఱచినను నవి పాడుట యెట్లు సాధ్య మగును? ఒకవేళ పాడినను రక్తి రెట్లుకట్టును? కనుక రాగములు మార్చుట దోషము కాదని చెప్పవచ్చును. ఏది యెట్లు మార్చినను అన్నమాచార్యులవారి కీర్తన కధికవ్యాప్తి చేకూర్చుట మన ధర్మమై యున్నది. సాహిత్యభావమునకు మాత్రము భంగమువాటిల్లకుండ నెన్ని స్వల్ప పరిణామములను గల్గించినను దోషముకాదని నా యభి ప్రాయము. ఈ విషయమున కొందఱు "నేటి క్రొత్త తేపటికి ప్రాత యగునుగాదా! ఉన్నదున్నట్లే యుంచుట మంచిదికాని మార్చిన లాభ మేమి" యందురు? లక్షణయుతమై పఠన పాఠనాదులలోనుండి బాగుగ వ్యాప్తమైయున్నవి మార్పుచేయుట యుచితము కాకపోవచ్చునుగాని యింతవఱ కెప్పుడును పాఠప్రవచనములలో లేక యెవరి కెరుకపడక యున్న కీర్తనముల నీనాడు పాఠప్రవచనములలోనికి వచ్చునట్లుచేయుట కారంభించు సమయమున మార్చిన నేమి? కూర్చిన నేమి? దీనఁగలుగు దోషమేమి? కనుక ఇంతవఱకు అణగియున్నవానిని క్రొత్తగా ప్రచా రములోనికి దెచ్చునప్పుడు చేసినమార్పు మార్పుకాదనుట నిక్కువము. ఇంతవఱకు పాఠప్రవచనములలోనుండి ప్రసిద్ధికెక్కిన త్యాగరాజస్వామి

కీర్తనములే శ్రోతల యానందమునకై రాగములనుమార్చి పాడుచుం డుటయు నెల్లరెఱింగిన విషయమే. అట్టితఱి నూతనముగ ప్రచారము లోనికి దేవలసిన అన్నమాచార్యులవారి కీర్తనములకు గల యపూర్వ రాగములను మార్పుచేసిన యా కీర్తనలకు హైన్యత యేలకలుగును? కనుక శ్రీ నారాయణాచార్యులుగా రవసరమునుబట్టియు, ఔచిత్యమును బట్టియు రాగములకు మార్పుకలిగించి స్వరపఱచి యీ కీర్తనలవ్యాప్తి కెంతయో దోహదము గావించియుండిరి. ఆచార్యులవారు రాగము లను మార్చుటలోగూడ కొన్ని పద్ధతుల నవలంబించియుండిరే కాని స్వేచ్ఛగ మార్చియుండలేదు. ఇక వీరవలంబించిన పద్ధతులనుగూర్చి యాలోచింతము.

పూర్వకాలమున సర్వజనవ్యాప్తముగా పాడబడియు, కాల క్రమేణ ఆ రాగనామములకు వ్యాప్తితగ్గి నామాంతర ప్రసిద్ధములై ప్రచారములో నుండుటవలన వెనుకటి రాగనామములను వదలి నేడు ప్రసిద్ధినందిన రాగనామములనే యుపయోగించియుండెను. ఇదియొక పెద్దమార్పేమియు కాదు. అన్నమాచార్యులగారికాలమున దేశాక్షి సర్వజనవ్యాప్తముగా పాడబడుచుండెడిది. అది నేటికాలమున బిల హరిగా పఠనపాఠనాదులలో ప్రశస్తి కెక్కినది రెంటికిని భేదమేమి యునంతగ గాన్పింపదు. కనుక ఆచార్యులవారు దేశాక్షిని బిలహరిగా మార్చి స్వరపఱచియున్నారు. రామక్రియ రాగమును జూడుడు. దీని నొకరు రామక్రియ యన్నారు. మఱియొకరు శుద్ధరామక్రియ యన్నారు. ఇంకొకరు కాశీరామక్రియ యన్నారు. తుదకెప్పుడో కామవర్ధనిగా మారిపోయి గాయకులకు ప్రత్యక్షమయ్యెను. ఆపేరే స్థిరమై యెల్లర మెప్పును బొంది యీనాటివఱకును కామవర్ధనిగానే నిలచియున్నది. కనుక ఆచార్యులవారు రామక్రియను వదలి కామ వర్ధనిని చేపట్టియున్నారు. అందపచారమేమి?

జన్య జనక రాగములలో దేనికి లోకమున ప్రసిద్ధియుండునో యా రాగమునే ప్రధానముగ స్వీకరించియున్నారు. మాళవ గౌళయే మాయా మాళవ గౌళ యనబడుచున్నది. తజ్జన్యమే సౌరాష్ట్ర రాగము. ఈ సౌరాష్ట్ర మీకాలమున నధికప్రచారము నంది

యున్నది. అయ్యది సాహిత్యభావమునకు సంబంధించియుండుటవలన మాళవగౌళను సౌరాష్ట్రరాగముగా మార్పుచేసియుండిరి.

వ్యవహారవశమున పేరు మార్పుచెందిన రాగమున్న వెనుకటి పేరును వదలి నేటికాలములో నెల్లరచే వ్యవహరింపబడు రాగ నామమునే వాడియున్నారు. సారంగరాగమును జూడుడు. పూర్వము సాళంగయని వాడబడుచుండెడిది. అది వ్యవహారమున సాళంగలోని ళ కారము రకారముగా నుచ్చరింపబడి సారంగమయ్యెను. నేటి కాలమున సారంగయనియే వాడుకలో నుండుటచే సారంగగా మార్చి యుండిరి.

నేటికాలమున అసలే వాడుకలో లేని రాగములను వదలి సాహిత్య భావరసాదులనుబట్టి ప్రసిద్ధములైన రాగములలోనికి మార్చి యుండిరి. దేసాళం మున్నగునవి నేటికాలమున వ్యవహారములో లేక మఱుగుపడి యున్నవి. బిలహరి, మోహనలు నేటికాలమున ప్రసిద్ధములైన రాగములు. సాహిత్య భావరసాదుల కవి యెంతయో యుపయుక్తములై కాన్పట్టుచున్నవి. కనుక ఆచార్యులవారు 'దేసాళం' అను నప్రసిద్ధ రాగమును బిలహరి, మోహనలుగా మార్పుచేసి యుండిరి. ఈవిధముగ మార్చి యాయా కీర్తనలలోని భావముల కింపులు సొంపులుకూర్చి యెంతయో మనోహరముగ నుండునట్లు స్వర వ్యాఖ్యానమును సాయించి యుండుట యెంతయు ముదావహము. వీరు కవి హృదయము గనునింపదగిన కవి పండితులు. రస భావములను గుర్తింపఁగల్గిన రసికులు. అట్టి సమర్థులగుటచేతనే యీ విధముగ స్వతంత్రించ గలిగియుండిరి. ఇట్లు చేయుటవలన భావి కాలమున నా కీర్తనల ప్రశస్తి యెంత యధికమగునో చెప్పతరము కాదు.

వీరు స్వరపఱచిన నూటయెనిమిది కీర్తనలలో కొన్ని భజన సాంప్రదాయమున కుపయోగపడునట్లును స్వరపఱచియున్నారు. అట్లు స్వరపఱచి యున్నను త్యాగరాజస్వామివారి దివ్యనామ సంకీర్తనల వలె సభలలో గానముచేయదగినవిగనే కన్పడుచున్నవి. ఈవ్యాఖ్యాత శ్రీనివాసునిపై ననేక కీర్తనములను రచించి భగవద్దాసుడగుటయే

కాక, శ్రీ స్వామివారి భక్తాగ్రగణ్యులైన అన్నమాచార్యులవారి కీర్తనములను స్వరపఱచి దాసానుదాసుడనై వినుతికెక్కెను.

ఇక వీరి రచనాపద్ధతిలో విమర్శింపదగినది మఱియొక యంశము కలదు. వీరు కొన్ని రాగములను మార్చియు, మార్చకయు కొన్ని కీర్తనలను స్వరపరచియున్నారు. మార్చి వేరురాగములలో కొన్ని టిని, మార్చక యా రాగములలోనే కొన్నిటిని స్వరపఱచుటలోఁగల వీరి యుద్దేశ్యమొకింత విచారింతము.

వీరు 'పాడి' రాగములోని కీర్తనల నెనిమిదంటిని గ్రహించి అందు రెంటినిమాత్రము బిలహరిలోనికి మార్చి, మిగిలినివానిని పాడి రాగములోనే స్వరపఱచియుండిరి. బిలహరిలో స్వరపఱచిన రెండుకీర్తనల సాహిత్య రసభావములు నా రాగరసమునకు సరిపడియుండుటంబట్టి వానినిమాత్రము బిలహరిలోనికి మార్చియుండిరి. మిగిలిన కీర్తనములలో పాడి రాగమున కనుకూలించిన సాహిత్యభావములే కలిగియున్నందున మార్పుచేయక వానిని 'పాడి' రాగములలోనే యుంచియున్నారు. పాడి రాగములో స్వరపఱచిన కీర్తనములకును వట్లలో భేదమును గన్పఱచియుండుట సూక్ష్మముగా పరికించిన గోచరముకాగలదు.

రెండవది లలితరాగము. ఈరాగములో నేడు కీర్తనలు స్వరపఱుపబడియున్నవి. అందొక్క కీర్తనమును మాత్రమే సింధుభైరవిగ మార్చి, మిగిలిన వన్నియు లలితరాగములోనే యుంచి స్వరపఱచియుండిరి. ఈకీర్తనలన్నియు సాహిత్యప్రధానములై కేవలము భజన సాంప్రదాయమున కుపయోగపడునట్లు కన్పించుచున్నవి. సింధుభైరవిలోనికిమార్చిన "వాడె వేంకటాద్రిమీద" అనుకీర్తనము పాడునప్పుడు తన్మయత్వముతో పొంగి భక్త్యావేశముతో నూగులాడిపోవ వీలగును. మిగినవానిలో నట్లూగఁజేయు శక్తి యాకీర్తనల సాహిత్య మందగపడదు. కనుక అట్లుఱ్ఱూతలూగించు సాహిత్యము కలదానికి తగినవిధముగ నుండుటకై సింధుభైరవి నుపయోగించెను. మిగిలినవి అంతటిమహావేశమును కలిగించునవికాక నీతి, వేదాంత సమ్మిళిత భక్తితో నిండియున్న వగుటవలన నవి గానముచేయునపుడు కదలక మెదలక భజింపవీలుగా నున్నవి. ఈభావముతో నాకీర్తనములకు

లలితమునే యుపయోగించియున్నారు. ఈవిధముగ వీరు రాగములను మార్పుజేయు విషయమై సాహిత్యభావాదుల కెట్టివైరుధ్యము కలుగకుండ జూచియున్నారు.

శ్రీమాన్ నారాయణాచార్యులుగారు స్వరపరచిన 108కీర్తనలు సమగ్రముగ నొకటికి రెండుమార్లు వారిచేతనే పాడించి వినియుంటిని. వారి స్వరప్రస్తారమున కెంతగనో సంతసించితిని. సాహిత్యమున గల మాధుర్యలాలిత్యాదిగుణములన్నియు స్వరకల్పనమున సొంపులుకులుకుచు వ్యక్తమగుచుండుటకు పరమానంద మొందితిని. స్వరకల్పనలోని సంగతులే కవిభావములను వెల్లడించు వ్యాఖ్యాన విశేషములు. ఆచార్యుల వారొక్కొకసంగతి వేసిపాడినపుడు అన్నమాచార్యుల వారి హృద్గతభావ మొక్కొకటి ప్రత్యక్షమగుచుండెను. ఆ రాగ సంచారమువలన నా కీర్తనయందలిరసము అనుభావ విభావాదులతో గూడ మూర్తీభవించి కన్పట్టుచు నెంతయో హృదయానందము కల్గించుచుండెను. అట్టి యానందము కలిగించుట కతన రాగములను మార్పుజేసిన కీర్తనలను ప్రత్యేకముగ విన కుతూహలము కలవాడనై స్వరపఱచిన శ్రీమాన్ నారాయణాచార్యులుగారిచేతనే అనేక పర్యాయములు పాడించి వినియుంటిని. మార్చిన రాగములన్నియు నా కీర్తనములలోని మాధుర్యాది గుణముల నధికముచేయుచున్నవని వచించుట కుప్పొంగిపోవుచున్నాను. కావ్య వ్యాఖ్యానములు చూచి విమర్శింపఁ దగినవి కావు. స్వరపఱచిన మహాను‌భావులే గానముచేయుగా విని విమర్శింపదగినవి. కనుకనే నేను ఆచార్యులవారి చేతనే పాడించి వింటిని. ఆ స్వరకల్పనలలోగల సొబగును సంపూర్ణముగా గ్రహించితిని. ఆవిషయమును లోకమునకు పరిచయము చేసితిని. మధుర భావోపేతములగు అన్నమాచార్యులవారి కీర్తనలకు శ్రీమాన్ నారాయణాచార్యులవారి వ్యాఖ్యాన మెంతగనో సొబగు చేకూర్చినదని నా దృఢ విశ్వాసము.

పద్య ప్రబంధములకును గేయ ప్రబంధములకును ఆనందజనకత్వమున భేద మొకింతగలదు. పద్య ప్రబంధములు చూచి మననము చేసి యందలి మాధుర్యమును గ్రోల వీలగును. గేయ ప్రబంధములను

కాదు. ఇయ్యవి గానముచేసిగాని, చేయుచుండగా వినిగాని యానంద మనుభవింపదగినవి. చూచి మననము చేసినంత మాత్రమున నందలి మాధుర్యము బోధపడదు. అట్టి గేయప్రబంధములకు స్వరకల్పన మత్యావశ్యకము. స్వరకల్పనముతోఁ గూడిన గేయములుగాని గానార్హములు కావు. గేయము లెంత హృదయంగమములుగానున్నను వానిసాహిత్యమునకు తగిన స్వరకల్పన ముండుట ముఖ్యము. ఆ స్వరకల్పనము కవి మనోగత భావమును వెల్లడించునదిగా నుండవలెను. అట్టి స్వరకల్పనతో గూడిన గేయప్రబంధమే సర్వజనాదరణీయమై సత్వరప్రచారమునొంది ఆనందసంజనకము కాగలదు. శ్రీ నారాయణాచార్యులు గారట్టి గేయప్రబంధ వ్యాఖ్యాతలై కృతికర్తలైన అన్నమాచార్యులుగారి ప్రతిభను లోకమునకు చాటియున్నారు. ఇట్టి కూలంకష వ్యాఖ్యానము లభించుటచే అన్నమాచార్యులవారి కీర్తనములు సత్వరవ్యాప్తినొంది సంగీత వాఙ్మయమునకు సంపూర్ణతను చేకూర్పఁ గలవు.

అన్నమాచార్యులవారు రచించిన గేయములసంఖ్య అనల్పము. అందిప్పటికి లభించినవి పదునాల్గువేలు మాత్రమేకదా! వానిలో శ్రీ నారాయణాచార్యులుగారు నాద ప్రధానముగ స్వరపఱచినవి నూట యెనిమిది. శ్రీ అనంత కృష్ణశర్మగారు సాహిత్యప్రధానముగా స్వరపఱచినవి నూట యెనిమిది. మొత్త మిప్పటికి రెండు వందల పదియాఱుమాత్రమే స్వరపఱుపబడియున్నవి. ఇంతమాత్రముతో నాపని ముగిసినట్లు తలంప వీలులేదు. ఇప్పటి కుద్ధరింపబడి ముద్రింపబడియున్న కీర్తన లన్నిటికి స్వరప్రస్తారము గావించినగాని త్యాగరాజస్వామివారి కీర్తనములవలె వీరి కీర్తనములును ప్రచారములోనికి వచ్చుటకు వీలుపడదు. ఈ కార్యము చెప్పినంత సులభముగాదు. మిగిలిన కీర్తనములనుగూడ నాద ప్రధానముగ స్వరపఱచుటకు శ్రీ నారాయణాచార్యులుగారే సర్వవిధముల సమర్థులు. కాని నిస్సహాయముగా నింతటి ఘనకార్యము నొక వ్యక్తి కొనసాగింపగల్గుట దుర్ఘటమే యగును. కనుక శ్రీ తిరుమల దేవస్థానమువారుకాని, ఆంధ్రప్రభుత్వముకాని యిట్టి మహాత్కార్యమును సాధించుటకు సర్వ

సమర్థులును, కార్యశూరులునైన శ్రీమాన్ తి. న. చ. వేంకట నారాయణాచార్యులవారి కుచిత గౌరవ పారితోషికాదు లుదారముగ కల్పించి యీ కార్యము నెరవేర్ప యత్నించుట యుత్తమోత్తమమైన కార్యము. ఇట్టి మహత్తర కార్యమునకు పూనుకొన విన్నవించు చున్నాడ.

నిస్సహాయముగ కార్యదీక్షతో నూటయెనిమిది కీర్తనలకు సంగీతవ్యాఖ్యానమును సర్వోత్తమముగ సంతరించిన శ్రీ నారాయణాచార్యులవారికమీదటను సంగీతమున నూతనమార్గములలో నిట్టివే యెన్నియో యుత్తమరచనలు చేసి సంగీత వాఙ్మయమున కపూర్వాలంకారములను సమకూర్చుదురు గాక యని వేడుచు, నిట్టికార్యములను సాధించుటకు గాను శ్రీయాచార్యుల వారికి సంపూర్ణాయురారోగ్యైశ్వర్యములు సమకూర్ప సర్వాభీష్ట ఫలప్రదాతయగు శ్రీ శ్రీనివాసున కంజలిఘటించి విన్నవించుకొను చున్నాడ.

నారాయణాచార్యులుగారూ! మీ రిటీవల మంగళకరుని, మదనజనకుని, తల్పగిరి రంగనాథుని నుతించుచు కీర్తనములు వ్రాసి యుంటిరికాదూ! ఆ కీర్తనలతో నొయ్యారిరంగయని దివ్యరూపమును సాక్షాత్కరింప జేసియుందురు. అవి లోకమున కెప్పుడంద జేయుదురు? వినూత్న రుచులంగొల్పు మీ సంగీతరచనలకు సంగీత ప్రపంచ మెదురు చూచుచుండును? ఇక సెలవు.

ఇట్లు

ఉభయభాషాప్రవీణ. వి. వి. నరసింహాచార్యులు.

## పండితాభి ప్రాయములు

# UNIVERSITY OF MADRAS

## MUSIC DEPT.

University Buildings,
Chepauk, MADRAS—5.
D/14th March 1960.

The Compositions of Annamacharya constitute an important item of our Musical heritage. They are the out-pourings of a devotee steeped in sterling devotion to the Lord of the Seven Hills. His compositions breathe the fragrance of Bhakti. They have been a source of inspiration to many later composers. Either due to want of enthusiastic disciples or to neglect on the part of the musicians and rasikas, the original tunes of most of the songs have been lost. It is a matter for joy that those precious compositions have been carefully engraved on copper plates and preserved. It is time that concrete steps were taken to popularise the compositions of the Tallapakam Composers. They may be set to attractive tunes in the ragas mentioned by the composer and the songs taught to musicians and popularised in schools and on the concert platform. Some of those compositions are in rare ragas like Kondamalahari, Mukhari Pantu, Narani and Abali. At present it is difficult to form an idea of the tone entity of those ragas. Taking into consideration the rasas reflected by the Sahityas even compositions in such rare ragas may perhaps be set to tunes which will be in consonance with the spirit of the Sahitya.

Sangita Vidwn T.N.C.V. Narayanacharyulu of Guntur has set to tunes 108 Kirtanas of Sri Annamacharya. I heard some of those compositions being rendered by Mr. T.N.C.V. Narayanacharyulu. The tunes are good and mirror to us the raga bhava well. Those songs set to music by him deserve to be printed and published. I wish his efforts all success.

(Sd) **P. SAMBAMOORTHY.**
Head of the Dept. of Indian Music.

**(TRUE COPY)**

Rallapalli Anantha Krishna Sarma,

TIRUPATI,

*Date* 25-3-1960.

శ్రీ తి. న. చ. వేంకటనారాయణాచార్యుల వారు నూతనముగా వర్ణ మెట్లు అమర్చి స్వరపరిచిన శ్రీ అన్నమాచార్యుల సంకీర్తనలుకొన్ని వారేస్వయముగా పాడి వినిపింపఁగా విని యెంతో సంతోషించితిని. కొంత ఇంతకుముందే ఆమార్గమున పనిచేసిన వాడనగుటచే శ్రీవారి పరిశ్రమవిలువ గ్రహింపగలను. వారుసుప్రసిద్ధ వాగ్గేయకారులు. వారి యీరచన త్వరలో ముద్రితమై ప్రకటింపబడి ఆంధ్రులకు ఆంధ్రేతరులకు రసికులకు హృదయాహ్లాదమొనగూర్చునని నాయాశంస —

(సం) రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ

# కీర్తనల అకారాది సూచిక

# స్వేచ్ఛా గురుతుల వివరములు

| గురుతులు | వివరములు |
|---|---|
| ప | పల్లవి. |
| అ | అనుపల్లవి. |
| చ | చరణము. |
| చి | చిట్టస్వరము. |
| * | తాళావర్తములో గీతముయొక్క అధికారమును జూపునది. |
| , | ఒక అక్షరకాలమును జూపునది. |
| ; | రెండు అక్షరకాలమును జూపునది. |
| ——— | మధ్యమకాలమును తెలునది. |
| ═══ | తృతీయకాలమును తెలుపునది. |
| । | ఈ గురుతుమాదిరి నిలువున ఉండునది క్రియాంతమును జూపునది. |
| \| | ఈ గురుతుమాదిరి నిలువునఉండునది లఘువు అంతమును, అనుద్రుతాంతమును, ద్రుతాంతములను జూపునది. |
| – | జాతుల విభాగమును జూపునది. |
| ,, | పై ప్రకారము స్వరసాహిత్యమును జూపునది. |
| . | సాహిత్యమందు అ-ఇ-ఉ-ం మొదలగు అచ్చులను తెలుపునది, |
| స̇ | స్వరముపైన చుక్కయున్నయెడల తారస్థాయి. |
| ని̣ | స్వరముక్రింద చుక్కయున్నయెడల మందరస్థాయి. |

తాళమందలి గురుతుల తెలుపునవి

| గురుతులు | వివరములు | గురుతులు | వివరములు |
|---|---|---|---|
| 1 | ఘాత | ◡ | అనుద్రుతము |
| 2 | కనిష్ఠిక యను వ్రేలు | O | ద్రుతము |
| 3 | అనామికయను వ్రేలు | 1 | లఘువు |
| 4 | మధ్యమ యను వ్రేలు | | |



సంగీత వ్యాఖ్యాతలు; (స్వరప్రకల్పకులు)
టి. ఎన్. సి. వేంకట నారాయణాచార్యులు.

శ్రీః

శ్రీనివాసాయనమః

శ్లో॥ శ్రీ వేంకటేశ మతి సుందర మోహనాంగం
శ్రీ భూమికాంత మరవింద దళాయతాక్షం।
ప్రాణప్రియం ప్రవిలసత్కరుణాంబు రాశిం
బ్రహ్మేశ వంద్యమనిశం వరదం భజామి॥

శంకరాభరణరాగలక్షణము—29వ మేళకర్తయగు ధీరశంకరాభరణరాగము దీనిని వ్యావహారికములో శంకరాభరణ రాగమని వాడుక. 5 వ చక్రములో 5వ రాగము ఋషభమధ్యమ - పంచమనిషాదములు రాగచ్ఛాయాస్వరములు. ఆరోహణమందు ఋషభధైవతములను నొక్కిపట్టవలెను. ఎల్లప్పుడు గానము చేయ తగినది.

| | |
|---|---|
| చ అం శు చ కా | కా చ శు అం చ |
| ఆ = స రి గ మ ప ద ని స | అ = స ని ద ప మ గ రి స |

(1) శంకరాభరణరాగము—ఆదితాళము

ప = కొనరో కొనరో మీరు కొనిమిమంచు – వునికి మనికి కెల్ల నొక్కటే మందు.

ద ని * }
. . * } కొనసాగు ______

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| చ - 3 | ; * గ మ | , ప పా | ప ప ప మ | గ మ గ మ | , రి గ మా ప పా | పా ప మ పా పా |
| | ; * అ జు | , న కు | బ ర మా . | యు . వై . | , . యొ స గి న | మం . . . దు |
| | ; * గ మ | , ద పా | ప మ మ గ | గ రి సా | ; గ మా ప పా | ప మ గ మ పా పా |
| | ; * ని జ | , మై . | లో . క ము | లె . ల్ల | ; నిం . డి న | మం . . . . దు |
| | ; * గ మ | , పా , | ద ని సాం | స స సాం | ; సాం రి గ గాం రి స | స ని ద ని సాం సాం |
| | ; * త్రి జ | , గ , | ము . లు | నె రు గ | ; తి రు . . . వేం . | క . టా . ద్రి పై |
| | ; * ప స | , స సా | స ని ని ద | పా ; | ; మ గా మ పా | ప మ మ గ రి గ మ ప |
| | ; * ధ్వ జ | , మె త్తై | గో . . . | నే ; | ; టి . ద రి | ను . న్న . మం . . . |
| 2 | ద ని * ప స | , ,, | ,, | ,, | ,, | ,, స ని ద ప |
| | దు . * ధ్వ జ | , ,, | ,, | ,, | ,, | ,, మం . . . |

ద ని * }
దు . * } కొనసాగు........

భైరవిరాగలక్షణము – 20వ మేళకర్తరాగము 4వచక్రములో 2వ రాగమైన నఠభైరవిరాగము కాని ఆరోహణమునందు కొన్ని సంచారవిశేషములవలన చతుశ్రుతిధైవతముండి యీరాగమును రంజింపజేయుచున్నది. దీనియందు ప్రకృతి వికృతి భేదములు గల్గిన 12 స్వరములు స్ఫురించును. అనుభవవేద్యము. సంపూర్ణరాగము. సర్వస్వరగమక వరిక రక్తిరాగము – సాయంకాలమున పాడదగినది.

చ సా శు చ కై
ఆ=స రి గ మ ప ద ని స

కై శు శు సా చ
అ=స ని ద ప మ గ రి స

## (2) భైరవి రాగము—చ – రూపక తాళము

(పెదతిరుమలాచార్యుల విరచితము)

ప=పరిపూర్ణుండవు నీవు పరాకున్నజా – మరిగి యుండని దేమా వల్లతప్పగాక

చ=వినవానీవేమియైన విశ్వమెల్లనీవుతే – యెవని విన్నవించని ఎడ్డతఃమింతెగాక
కనవా నీవిన్నియు నీకనులయెందుజూచిన – పనితో నాభావముఁజూపని నేరమి గాక = (పరి)

(2) పలుకవానీవేమియైనబహుశబ్దమయుడవు – అలరి పిలువని నాయువివేకమింతేగాక
నిలువవా నాముందఱ నిఖిలస్వరూపుడవు – తెలిసి చూడలేని సందేహమింతేగాక = (పరి)

(3) మన్నించవా నీవేమి మఱుఁగుజొచ్చితి నంటే – పన్ని మత్తుడనైయున్న పాపకర్మముగాక।
ఇన్నిట శ్రీవేంకటేశ యేలితివి నన్నునిట్టె – ఇన్నాళ్ళెఱుఁగనిభాగ్యమిట్లుండెఁగాక॥ (పరి)

## స్వరసాహిత్యములు

| | O | 1 | O | 1 | O | 1 | O | 1 |
|---|---|---|---|---|---|---|---|---|
| ప-1 | సా సా | సా ; నీ ; | దా పా | మా పా ప మ గా | రీ సా | సా రీ గా మా | పా దా | పా ; ; ; |
| | ప రి | పూ ; ర్ణం ; | డ వు | నీ . . . . | . ను | ప రా . ను | . స్న | దా ; ; ; |
| 2 | ,, | ,, | ,, | మపమపపమగా | ,, | ,, | ,, | పా ; మ ప ద ని |
| | ,, | ,, | ,, | నీ . . . . . . | ,, | ,, | ,, | దా ; . . . . |
| 3 | స రి స రి | స క్రీ స్న నీ ; | దా పా | రి గ మ ప ద ని సా | స ని ద ప | మ గ రి స — రి గ మ ప | ,, | ,, |
| | ప . రి . . | పూ . . ర్ణం ; | డ వు | నీ . . . . . . | . . ను . | ప . రా . — ను . . . | ,, | ,, |
| 4 | స రి గ రి | ని స రి స-పదనిని | ,, | ,, | ,, | ,, | ,, | ,, |
| | ప . రి . | పూ . . . . -ర్ణం . . . | ,, | ,, | ,, | ,, | ,, | ,, |
| | స ని స ని | స ప పా దా పా | మపమప | ప మ గా రీ సా | స రి గ మ | పా — మ ప ద ని సా | స రి గ రి | సనిదపమపదని { పరి\|\| |
| | మ . రి . | గి . యుం . . డ | ని . ద . | మా . . వ ల్ల | త . . . | స్వా — గా . . . . | క . . . | . . . . . . . |
| చ- | నీ నీ | నీ ; నీ ; | నీ ; | దా పా దా పా | మపమప | పా ప మ గ రి సా | రిగమప | పా దా పా ; |
| | వి న | వా ; నీ ; | వే ; | మి త్రై . న | వి . . . | శ్వ మె . . . ల్ల | వీ . . . | . ను లే ; |
| | మ ప మ ప | పా ప మ గ రి సా | స ని ధా | నీ సా సా ; | ; సా | రీ గా మా పా | పదపద | ప మ పా దా పా |
| | రయి . న . | నీ వి . . . స్న | విం . . | చ ని ఈ ; | ; ఎ | ద్దే త న మిం | తే . . . | . . గా . క |
| | ; ప ద | నీ ; నీ ; | నీ సా | సా సా సా ; | రి గ మా | మా గా ; రీ | స ని దా | నీ సా సా ; |
| | ; క న | వా ; నీ ; | వి . | న్ని యు నీ ; | క . ను | లె రెం ; డు | జా . . | . చి న ; |
| | పా రీ | సా , ని దా పా | మపమప | ప మ గా రీ సా | రిగమప | గ మ ప ద — ప ద ని స | స రి గ రి | సనిదప-మపదని { పరి |
| | ప ని | తో , . నా . | భా . . . | వ . ము జా . | ప . . . | ని . . . — నే . ర , | మి . . . | గా . . . క . . . |
| చ-2 | ప లు | క వా నీ ; | వే ; | మి త్రై , న | బ ,హు, | శ , , , బ్ది , | మ్మ,యు, | ; డ వు ; |
| | అ , ల , | రి పి , లు , వ | నా ; | ,యు వి వే | ; క , | ; ; ; మిం | తే , , , | ; గా ; క |

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| చ 3:— | ; ని అ | వ వా ; ; | నా ; | ముం , ద ర | ని ఖి , | ల స్వ రూ | పూ , ; | ; ద న్రు ; | |
| | తె లి | సి , చూ డ | తే , , , | ని , , , సం ; | దే , , ; | హ , , ;—మిం , , , | తే , , , | గా , , , క , , , | = |
| | మ , | న్నిం, చ వ | నీ ; | ; వే , మి | మ , ర్యు, | గు జో , , చ్చి | తి , , ; | ; సం ; జే | |
| | ప , న్ని , | మ , ; త్తు డ | నై , , , | యు , , , న్న | ; పా | ప క . ర్మ | ము , , ; | , , గా , క | |
| | ; ఇన్ని | ట , శ్రీ ; | వేం ; | క టే , శ | యే , , | లి తి వి ; | న , , | న్ను ని ట్టే | |
| | ఇ ; | నా , , శై లు | గ , ని , | భా , , ; గ్య | మి , , ; | ట్లుం , , డె , , , | , , , ; | గా , , , క , , , | = |

N, B:— 2, 3 చరణసాహిత్యములను మొదటచరణము ననుసరించి పాడవలెను.

ధన్యాసిరాగలక్షణము – 8వ మేళమైన హనుమత్తోడి రాగజన్యము – ఔడవసంపూర్ణ రాగము – గాంధార నిషాదములు రాగచ్ఛాయాస్వరములు – స గా మ గ రి స – ప ని సా ని ద ప మ గ రి స – ని స గా మ గ రి స మొదలగు ప్రయోగములు రక్తిని గలిగించును. మొదటియామమున పాడతగినది.

సా శు కై కై శు శు సా శు

ఆ=స గా మ ప నీ స = అ=స ని ద ప మ గ రి స

(3) ధన్యాసిరాగము = చ=రూపకతాళము

ప= దేవదేవంభజే దివ్యప్రభావం - రావణాసుర వైరి రఘుపుంగవం।

చ= రాజవర శేఖరం - రవికులసుధాకరం — ఆజానుబాహు నీలాభ్రకాయం।

రాజారి కోదండ రాజ దీక్షాగురుం - రాజీవలోచనం రామచంద్రం॥

చ - (2) నీలజీమూత సన్నిభశరీరం ఘనవి — శాలవక్షం విమలజలజనాభం।
తాలాహినగధరం ధర్మసంస్థాపనం — భూలలనాధిపం భోగిశయనం॥

చ (3) పంకజాసన వినుత పరమనారాయణం — శంకరార్జిత జనకచాపదళనం।
లంకా విశోషణం లాలిత విభీషణం — వేంకటేశం సాధువిబుధవినుతం॥

స్వర సాహిత్యములు

| | O | 1 | O | 1 | O | 1 | O | 1 |
|---|---|---|---|---|---|---|---|---|
| ప - 1 | సా ; | సా – సా గా మా | పా ; | ; దా పా ; | ద ప మా | పా – పా మా పా | ప ప మా | ప మ గా రీ సా |
| | దే ; | వ – దే – – | వం ; | ; భ జే ; | ది . . | . – వ్య . (ప | భా . . | . . . వం . |
| 2 | ” | ” | పా నీ | దా దా పా ; | ” | ” | ” | ” |
| | ” | ” | వం . | . భ జే ; | ” | ” | ” | ” |
| 3 | ” | ” | ప ని స రి | స రి-స ని దా పా | ” | ” | ” | ” |
| | ” | ” | వం . . . | . . -భ . జే . | ” | ” | ” | ” |
| 1 | సా ; | సా నీ దా పా | నీ సా | సా ; సా సా | సా సా | సా గా మా పా | ద ప ప మ | పమమ గారిసని { దేవ |
| | రా ; | వ ణా . . | సు ర | వై ; . రి | ర ఘు | పుం . . . | గ . . . | వం . . . . . . |
| 2 | ” | ” | ” | ” | స ని స రి | స గ గ మ–గ మ ప ని | స ని ద ప | నిదపమగరిసని { దేవ |
| | ” | ” | ” | ” | ర . ఘు . | పుం . . . – – – – . | గ . . . | వం . . . . . . . |
| చ 3 | ” | ” | ” | ” | ని స గ మ | గ మ ప ని - స రి స ని | ని ద ప మ | గరి-పమగరిసని { దేవ |
| | ” | ” | ” | ” | ర . ఘు . | పుం . . . – – . . . . | గ . . . | . . - వం . . . . |
| 4 | ” | ” | ” | ” | ని స గ మ | ప ని – రి సా ని ద ప | స నీ ద | పమ-మగారిసని { దేవ |
| | ” | ” | ” | ” | ర . ఘు . | . . – పుం . . . . | గ . . | . . - వం . . . . |

దేవ దేవంభజే అని = మొదటిసంగతితో నిలుపవలెను,

(శ్రీ)రాగలక్షణము = 22వ మేళకర్తయైన ఖరహరప్రియ రాగజన్యము — ఔడవవక్రసంపూర్ణ రాగము (ఘనరాగము) దీర్ఘ ఋషభ సాధారణగాంధార చతురశ్రుతిధైవతములు రాగచ్ఛాయాస్వరములు — ధైవతగాంధారములు కొద్దిప్రయోగములు గల రాగము. (ప ద ని ప) ప్రయోగము కదాచిత్తుగా వచ్చును. సమస్తమంగళప్రదమైన రాగము — ఎల్లప్పుడు గానము చేయతగినది.

చ శు కై      కై చ కై శు చ సా చ
ఆ= స రి మ ప ని స = అ= స ని ప ద ని ప మ రి గా రి స

(4) (శ్రీ)రాగము=ఖండచాపుతాళము=(అర్ధజంపెతాళముకూడా వేయవచ్చును.)

ప= నిత్యాత్ముఁడైయుండి నిత్యుఁడై వెలుఁగొందు — సత్యాత్ముఁడైయుండి సత్యమై తానుండు।
ప్రత్యక్షమైయుండి బ్రహ్మమైయుండు సం-స్తుత్యుఁ డీ తిరువేంకటాద్రి విభుఁడు॥

చ= ఏమూర్తి లోకంబులెల్ల నేలెడు నాతఁ — డేమూర్తి బ్రహ్మాదులెల్ల వెదకెడు నాతఁ।
డేమూర్తి నిజమోక్ష మియ్యజాలెడు నాతఁ — డేమూర్తి లోకైకహితుఁడు।
యేమూర్తి నిజమూర్తి యేమూర్తియునుఁ గాడు — యేమూర్తి త్రైమూర్తు లేకమయిన యాతఁ।
డేమూర్తి సర్వాత్ముఁ డే మూర్తి పరమాత్ముఁ డామూర్తి తిరువేంకటాద్రి విభుఁడు॥

చ=2= యేదేవు దేహమున నిన్నియు జన్మించె నే — దేవు దేహమున నిన్నియును నణఁగె మరి
యేదేవు విగ్రహం బీ సకల మింతయును — యేదేవు నేత్రంబు లినచంద్రులు।
యేదేవుఁ డీ జీవులిన్నింటిలోనుండు — నేదేవు చైతన్య మిన్నిటికి నాధార
మే దేవుఁ డవ్యక్తుఁడే దేవుఁ డద్వంద్వుఁ — డా దేవుఁడీ వేంకటాద్రివిభుఁడు॥

చ—3— యేవేల్పు పాదయుగ మిలయు నాకాశంబు — యేవేల్పుపాద మేశాంతంబనంతంబు
యేవేల్పు నిశ్వాస మీ మహామారుతము — యేవేల్పు నిజదాసు-లీ పుణ్యులు।
యేవేల్పు సర్వేశుఁ డేవేల్పు పరమేశు — డేవేల్పు భువనైకహితమనోభావకుఁడు
యేవేల్పు కడు సూక్ష్మమేవేల్పు కడు ఘనము — ఆ వేల్పు తిరువేంకటాద్రి విభుడు॥

స్వ ర సా హి త్య ము లు

| | | | | |
|---|---|---|---|---|
| ప — | స̇ీ సా — రీ ; రీ | రీ ; — రీ గా రీ | ని̣ స రి గ — రి స స̇ీ షా | స̇ీ స̇ీ — సా ; సా |
| 1 | ని . — త్యా ; త్మ | ద్దై ; — యుం . డి | ని . . . — త్య . ద్దై . | వె లు — గొం ; దు |
| 2 | ,, | మా పా — ప మ రి గ రి స | ,, | ,, |
| | ,, | ద్దై . — యుం . . . డి . | ,, | ,, |
| | ,, | రీ మా — మా పా పా | ని ని పా — ని ప పా మా | ప మ రీ — గ రి రి గ రి స |
| 3 | ,, | ద్దై . — యుం . డి | ని . . — త్య . ద్దై . | వె . లు — గొం . . . దు . |
| 4 | స̇ీ సా — రీ ; రీ | రి మా — పా నీ నీ | స ని పా — స ని పా మా | ప మ మ రి — గ రి రి గ రి స |
| | ని . — త్యా ; త్మ | ద్దై . — యుం . డి | ని . . — త్య . . ద్దై | వె . లు . — గొం . . . దు . |
| | ని̣ స రి గ — రి స నీ షా | ద్దై స̇ీ ; — సా సా సా | రీ మా — మా పా ; | పా పా — పా ; పా |
| | స . . . — త్యా . . త్మ | ద్దై ; — యుం . డి | స . — త్య మై ; | తా , — నుం ; దు |
| 1 | నీ సా — క్రీ గా క్రీ | క్రీ ; — క్రీ గా క్రీ | ని స రి గ — రి స నీ పా | నీ నీ — సా ; సా |
| | ప్ర . — త్య . త్మ | మై ; — యుం . డి | బ . . . — హ్మ . మై . | యుం . — దు ; . |
| 2 | ,, | ప మ రీ — గ రి రి గ రి స | ,, | నీ నీ — సా ; సా |
| | ,, | మై . . — యుం . . డి . | ,, | యుం . — దు ; సం |
| | రి గ రి గ — రీ రీ సా | స ని స రి — స ని నీ పా | మ ప ని స — స రి — రి గ రి స | స రి స ని — ప మ — రి గ రి స |
| | స్మ . . . — త్యా డి . . | తి . రు . — వేం . . క | టా . . . — ద్రి . — వి . భు . | దు . . . — . . — . . . . |

